

# శ్రీభగవద్రామానుజులు

రచన

డా॥ సముద్రాల లక్ష్మణయ్య




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

2016

# ముందుమాట

విశిష్టాద్వైత ప్రచారకులుగా ప్రసిద్ధిపొందిన శ్రీ భగవద్రామానుజుల వారు మన ఆచార్య పరంపరలో అగ్రశ్రేణికి చెందినవారు. వెయ్యి సంవత్సరాల క్రిందట ఏ మాత్రం భేదభావం లేకుండా జనానీకానికంతటికీ వారు చూపిన భక్తిమార్గం ఈనాటికీ అనుసరింపదగినదై ప్రజలను తరింపజేస్తున్నది.

భగవంతుడెంత ముఖ్యమో భగవద్ధర్మాన్ని ప్రచారం చేసే ఆచార్యులు కూడా అంతే ముఖ్యమని వైష్ణవ సంప్రదాయం ఉపదేశిస్తున్నది. అందుచేత భగవద్రామానుజులు సాకారమైన భగవత్స్వరూపంగా ఆరాధింప బడుతున్నారు. ఆచార్యులవారు నూట ఇరువది సంవత్సరాలు జీవించారు. జీవితంలో ఎన్నో చిక్కులను ఎదుర్కొన్నారు. భగవన్నిష్ఠాపరులు గాన సులభంగా అన్ని చిక్కులనూ అతిక్రమించగలిగారు. భారతావని అంతటా వైష్ణవ సంప్రదాయం పాటించేవారు శ్రీహరితోపాటు ఈ గురువును గూడా నిత్యమూ స్మరిస్తున్నారు.

తిరుమలలోని దేవుడు శివుడా? కేశవుడా? అన్న సంశయం భక్తులకు కల్గినపుడు ఆ స్వామి కేశవుడే అని నిరూపించిన ఘనత భగవద్రామానుజులకే చెందుతుంది. వారానాడు ఏర్పరచిన పూజా విధానాలే నేటికీ తిరుమలలో కొనసాగుతున్నాయంటే వారెంతటి మహిమాన్వితులో గ్రహించవచ్చు.

శ్రీభగవద్రామానుజాచార్యులవారు అవతరించి వెయ్యి సంవత్సరాలు పూర్తి అవుతున్న శుభసందర్భంలో తిరుమల తిరుపతి



దేవస్థానంవారు ఒక సంవత్సర కాలం వారి పేరున ఘనంగా ఉత్సవాలు జరపాలని నిర్ణయించారు. ఈ ఉత్సవాలలో దివ్య దేశయాత్రలు, ధార్మిక ప్రవచనాలు, గ్రంథ ప్రచురణలు మున్నగు అనేక కార్యక్రమాలు నిర్వహించాలని నిశ్చయించారు. శ్రీరామానుజుల వారి సర్వతోముఖమైన వైభవాన్ని నలుదెసలా వ్యాప్తి గావించడానికి అవసరమైన ధార్మిక కార్యక్రమాలు ఈ ఉత్సవాలలో నిర్వహింపబడనున్నాయి.

ఈ ఉత్సవ ప్రణాళికలో శ్రీభగవద్రామానుజుల విశిష్టతను వివరించే రచనల ప్రచురణ అతిముఖ్యమైనది. ఈ సందర్భంలో సుప్రసిద్ధ పండితులు, మహామహోపాధ్యాయ డా॥ సముద్రాల లక్ష్మణయ్య రచించిన 'శ్రీభగవద్రామానుజులు' అన్న ఒక లఘు గ్రంథాన్ని ప్రచురిస్తున్నాము. సులభశైలిలో శ్రీరామానుజులవారి జీవిత విశేషాలను వివరించే ఈ పుస్తకం విస్తృతప్రచారం పొందగలదని ఆశిస్తూ గ్రంథకర్తను మనసారా అభినందిస్తున్నాను.

సదా శ్రీవారి సేవలో...

**డా॥ డి. సాంబశివరావు,** ఐ.ఏ.ఎస్.,
**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

# పీఠిక

త్యాగరాజస్వామివారు ***"నగుమోము కనలేని నాజాలి తెలిసి"*** అన్న ఒక కీర్తన రాశారు. ఇది సుప్రసిద్ధ కీర్తన. ఇందులో అద్భుతమైన భావచిత్రం ఒకటి ఉన్నది.

***"గగనానికి ఇలకు బహుదూరంబనినాడో."***

స్వామీ! నువ్వు నిన్ను ఎందుకు ఆదుకోవడంలేదు. గరుత్మంతుడు నీమాట వినలేదా? లేదా ఆయన ఆకాశానికి భూమికి చాలా దూరం ఉంది, వీలుకాదన్నాడా? అని భక్తిమయమైన కల్పన చేశారు.

భగవద్రామానుజులు తన జీవితకాలంలో ప్రతిక్షణాన్ని ప్రతికణాన్ని ఈ అన్వేషణలోనే గడిపారు. భాగవతుడికి భగవంతుడు ఎంతదూరంలో ఉంటాడు అన్నది ఆయన రచనలలో జీవితంలో పలు పర్యాయాలు నిరూపించారు, ఆవిష్కరించారు. భగవంతుడు భక్తుడికి సన్నిహితుడు, స్నేహితుడు, ఆప్తుడు, తల్లి, తండ్రి, దైవము - అన్నీ కూడా. ఇదీ వారు లోకానికి ప్రసాదించిన వరం.

పరమాత్మ ఎప్పుడూ పరమ దయామయుడు. కొలిచేవారి కొంగుబంగారం. ఆదరించేవారికి ఆణిముత్యం. మనసు తలుపులు తెరిచి చెడు తలపులు వదిలించుకొని ఆయన పాదాలను ఆశ్రయిస్తే నిన్ను రక్షించే బాధ్యత ఆయనదే. దీనిని ఆయన శరణాగతి అని పేర్కొన్నారు.

శ్రీభాష్యం వారి సుప్రసిద్ధ రచన. అందులో బ్రహ్మ సూత్రాలకు వ్యాఖ్యానం ఉంది. దానికి ఓం ప్రథమంగా వ్రాసిన మంగళ శ్లోకంలో--

***"వినత వివిధ భూత వ్రాత రక్షైక దీక్షే..."*** అన్నారు.



అంజలి ఘటించి శరణు జొచ్చిన సమస్త జీవులను కాపాడుట అనే ఏకైక దీక్ష కలిగిన ఓ శ్రీనివాసా - అని దాని అర్థం.

తన జీవిత కాలమంతా భగవంతునికి భాగవతునికి మధ్య వచ్చే అంతరాలను తొలగించి భగవంతుడ్ని భాగవతునికి ఆంతరంగికునిగా మార్చాడు.

లోక కళ్యాణం కోసం మానవ శ్రేయస్సుకోసం ఎన్నో సంస్కరణనల్లి విజయవంతంగా అమలుజేసి శ్రీరంగనాథుని ఆజ్ఞమేరకు పరమపదం అలంకరించారు.

ఇంత అద్భుతమైన రామానుజుల జీవిత చరిత్రను ఆగకుండా ఒక గుక్కలో చదువుకునేటట్లుగా సరళసుందరంగా రచించారు విద్వద్వరేణ్యులు శ్రీమాన్ సముద్రాల లక్ష్మణయ్యగారు. కథనంలో ఎక్కడా క్లిష్టతగాని, భాషలో కఠినత్వంగాని లేకుండా చాలా సులభంగా సామాన్య జనానీకానికి శ్రీ భగవద్రామానుజుల వారి జీవితాన్ని కొండ అద్దమందు చూపించినట్లు చూపించినారు.

శరణన్నవారిని వలదని వారించక కలతలు పోగొట్టి, కడదాకా నడిపించే బహుబ్రహ్మమయుడు శ్రీనివాసుడు అనుగ్రహించాలని కోరుకుంటూ....

సదా శ్రీనివాసుని సేవలో......

**నందివెలుగు ముక్తేశ్వరరావు,** ఐ.ఏ.ఎస్., (రిటైర్డ్)
విశేషాధికారి, (ప్రాజెక్టులు)
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# నివేదన

**మేషార్ద్రాసంభవం విష్ణో**
**ర్దర్శన స్థాపనోత్సుకమ్ ।**
**తుండీరమండలే శేష**
**మూర్తిం రామానుజం భజే ॥**

ధర్మరక్షణకై తాను అవతరిస్తానని భగవంతుని మాట. ఈ అవతరణంలో రెండు విధానాలున్నాయి. సాక్షాత్తుగా భగవంతుడే తాను రాముడుగానో, కృష్ణుడుగానో అవతరించవచ్చు, లేదా తన అనుయాయులలో ఒకరిని ధర్మరక్షణకై పంపవచ్చు. ఇలా భగవంతుని ప్రతినిధులుగా ఎందరో మహానుభావు లవతరించి తమ కర్తవ్యం నిర్వహించియున్నారు.

ఇట్టి ధర్మరక్షకులలో భగవద్రామానుజులు అతిముఖ్యులు.

**'గతులన్నీ ఖిలమైన – కలియుగమందున**
**గతి యీతడే చూపె – ఘనగురుదైవము'**

అని అన్నమయ్య ఈ ఆచార్యపురుషులను ప్రస్తుతించారు. జనులు తరించడానికి అనువైన భక్తిమార్గాన్ని విస్తృతంగా ప్రచారం చేసినవారు వీరు. 'విశిష్టాద్వైతం', 'రామానుజ దర్శనం' అన్న పేరుతో ప్రఖ్యాతమయిందంటే వారెంతటి ఘనులో గ్రహించవచ్చు.

భగవద్రామానుజులలో గల సర్వ సమభావం వారిని మతాచార్యులలో అగ్రశ్రేణిలో నిలిపింది. 'సమోఽహం సర్వభూతేషు' అన్న గీతాచార్యుని సూక్తిని ఆచరణాత్మకంగా తమ జీవితంలో నిరూపించినవారు శ్రీరామానుజులు.

వారు, వీరు – అనే తేడా లేకుండా జనులందరికీ వీరు తిరుమంత్రాన్ని ప్రసాదించారు. కులానికి గాక గుణానికి



ప్రాధాన్యమివ్వడం, శరణాగతి మార్గాన్ని జనులందరికి అందుబాటులోకి తేవడంవంటి విశిష్టమైన చర్యలు వారిని సాటిలేని మేటి ఆచార్యులుగా నిరూపించాయి.

వీరు మాటలాడే దైవంగా విఖ్యాతి గాంచారు. శ్రీభాష్యాది గ్రంథాలతో ఆత్మతత్త్వాన్ని సువ్యక్తం కావించారు. తిరుమల క్షేత్రాన్ని విష్ణుక్షేత్రంగా నిరూపించారు. ఇక్కడే రామాయణం పఠించారు. ఇలా తిరుమలకూ, శ్రీరామానుజులవారికీ విడదీయరాని అనుబంధం ఏర్పడింది. యతిరాజుగా నేడు వారు లోకపూజ లందుకొంటున్నారు.

2005వ సంవత్సరంలో ధర్మప్రచార పరిషత్తువారి అభ్యర్థనపై నే నీగ్రంథం రచించాను. కాని అప్పట్లో ఏ కారణంవల్లనో ఇది వెలుగులోకి రాలేదు. ప్రస్తుతం శ్రీరామానుజ సహస్రాబ్ద్యుత్సవ కార్యక్రమాల్లో భాగంగా దీన్ని ప్రచురించడం తగునన్న టి.టి.డిలోని అన్ని ప్రాజెక్టుల విశేషాధికారి శ్రీ ఎన్.ముక్తేశ్వరరావు (విశ్రాంత ఐ.ఏ.యస్. అధికారి) గారి సూచననుసరించి ఇది ప్రచురింపబడుతున్నందుకు సంతసిస్తున్నాను.

దీని ప్రచురణ కనుమతించిన శ్రీకార్యనిర్వహణాధికారి గారికీ, సహకరించిన ధర్మప్రచార పరిషత్కార్యకర్తలకూ, తి.తి.దే. ముద్రణాలయాధిపతులకూ నా కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

**– డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

తిరుపతి

## విషయ సూచిక









# శ్రీభగవద్రామానుజులు

*అఖిలభువనజన్మస్థేమ భంగాదిలీలే*
*వినత వివిధ భూతవ్రాత రక్షైకదీక్షే ।*
*శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే*
*భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా ॥*

*యో నిత్యమచ్యుతపదాంబుజయుగ్మరుక్మ*
*వ్యామోహతస్తదితరాణి తృణాయ మేనే ।*
*అస్మద్గురోర్భగవతో౽స్య దయైకసింధో*
*రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥*

## అవతరణం

ఈసృష్టికి భగవంతుని సంకల్పమే ముఖ్యకారణం. 'తేన వినా తృణమపి న చలతి' అన్నట్లు ఆ దేవుని సంకల్పం లేకుంటే గడ్డిపోచ కూడా కదలదు.

సృష్టించిన జగత్తు క్షేమంగా వుండాలంటే ధర్మం ఆచరణలో వుండాలి. ధర్మానికి హాని కలిగితే లోకం సంక్షోభానికి గురి అవుతుంది.

ధర్మానికి గ్లాని కల్గినప్పుడు భగవంతుడు అవతరిస్తాడని భగవద్గీత ప్రకటించింది. అవతారాలన్నీ ధర్మగ్లాని కల్గినప్పుడే వచ్చాయని పురాణాలు ఘోషిస్తున్నాయి.

మహావిష్ణువు కలియుగంలో తీవ్రమైన ధర్మక్షతి కలగడం గమనించాడు. ఎలా ధర్మరక్షణ చేయడమా! అని ఆలోచిస్తున్నాడు. అప్పుడు ఆదేవుణ్ణి సదా సేవించే ఆదిశేషుడు 'స్వామీ! మీ సేవకుడను.



మీరీ విషయమై విచారపడవద్దు. నేను ధర్మరక్షణకై శ్రమిస్తాను' అని చెప్పాడు. అందుకు భగవాను డంగీకరించాడు.

త్రేతాయుగంలో శ్రీరామునికి తోడుగా లక్ష్మణరూపంలో అవతరించిన ఆదిశేషుడు కలియుగంలో భగవదనుమతి మేరకు భగవద్రామానుజులుగా అవతరించి ధర్మరక్షకు డయ్యాడు.

## కాంతిమతీ కేశవయజ్వలు

తమిళదేశంలో చెన్నపట్టణానికి సమీపంలో శ్రీపెరంబూదూరు అనే ఒక గ్రామం ఉన్నది. వేదాధ్యయన సంపన్నులైన విప్రులకు నిలయమది. అందులో ఎన్నో వైష్ణవాలయాలు ఉన్నాయి. అక్కడ నివసించే ద్విజకుటుంబాలలో ఆసూరివారు ప్రసిద్ధులు. కేశవసూరి ఆ వంశంలో జన్మించిన మహామహుడు. అతడు సదాచారపరుడు, విద్వదగ్రేసరుడు, సకల సద్గుణ సంపన్నుడు. వివిధ యజ్ఞకర్త అయిన ఆయనను కేశవయజ్వ అని పిలిచేవారు. కాంతిమతి అనే సాధ్వీమణి ఆయనకు అన్నివిధాలా తగిన సహధర్మచారిణి.

సమస్త కల్యాణాలకూ ఆకరమైన ఆకుటుంబంలో సంతానహీనత అన్న దోషం వారికి విచారం కల్గించింది. సంతతిని ప్రసాదించమని వారు శ్రీనివాసుని వేడుకున్నారు.

ఒకనాటి చంద్రగ్రహణకాలంలో ఆ సతీపతులు సముద్రస్నానం చేశారు. శ్రీపార్థసారథిస్వామి నారాధించారు. పుత్రకామేష్టి కూడా నిర్వహించారు. వారి భక్తికి ప్రీతి పొందిన స్వామి "నేనే మీ పుత్రుడనై జన్మిస్తాను" అని వరమిచ్చాడు. వారి ఆనందం మేరమీరింది.

క్రీ.శ. 1017వ సంవత్సరం చైత్ర శుద్ధ పంచమీ గురువారం నాడు ఆర్ద్రా నక్షత్రయుక్తమైన కర్కాటక లగ్నంలో కాంతిమతి

మగశిశువును ప్రసవించింది. తల్లిదండ్రులు, బంధువులు సంతోష వార్ధిలో మునిగి తేలారు. విప్రులను భూరిదక్షిణలతో సంతృప్తులను చేశారు.

కాంతిమతి సోదరులు శ్రీశైలపూర్ణులు సోదరికి పుత్రోదయ మైనదని తెలుసుకొని శ్రీపెరంబూదూరికి విచ్చేశారు. బాలునికి శంఖచక్రాంకనోత్సవం జరిగింది. 'రామానుజులు' అని నామకరణం చేశారు. 'ఇతడు శేషుడే గాబోలు' అని పెద్దలు భావించారు.

ఆబాలుడే యతిరాజుగా, ఉడయవర్లుగా, ఎంబెరుమానార్‌గా, భాష్యకారులుగా తరువాతి కాలంలో ప్రసిద్ధుడై లోకారాధ్యుడయ్యాడు.

బాలునికి జరుగవలసిన సంస్కారాలన్నీ జరిగాయి. ఐదవయేట అక్షరాభ్యాసం, ఎనిమిదవయేట ఉపనయనం యథావిధిగా నిర్వహింప బడ్డాయి. అతడు మహామేధావి. వేదాదివిద్యలన్నీ ఆకారణజన్మునికి కరతలామలకా లయ్యాయి.

బాలునికి 16 ఏండ్లు రాగానే వివాహవిధి గూడా జరిగింది. భార్య పేరు రక్షకాంబ. భగవత్సంకల్ప మెట్టిదో! కల్యాణం జరిగిన కొంత కాలానికి కేశవసూరి విష్ణుసన్నిధి చేరుకొన్నాడు. అవతార మూర్తిగాన రామానుజుడు పితృవియోగ దుఃఖం నిగ్రహించుకొన్నాడు.

## యాదవప్రకాశుడు

ఆ కాలంలో కంచిలో యాదవ ప్రకాశుడనే మహాపండితు డుండేవాడు. విద్యాభ్యాసానికై రామానుజుడు ఆవిద్వాంసుని ఆశ్రయించాడు. రామానుజుడు సకల కల్యాణ గుణసంపన్నుడైన శిష్యుడు. కాని గురుత్వం వహించిన యాదవప్రకాశుడు ఆత్మగుణ హీనుడు. అందువల్ల ఆగురుశిష్యులకు పొంతన కుదిరినది కాదు. పైగా యాదవప్రకాశుడు శ్రీహరిదూషకుడు.



ఒకనాడు గురువు 'కప్యాసం పుండరీకమేవమక్షిణీ' అన్న శ్రుతివాక్యానికి "భగవంతుడు కోతి పిఱ్ఱనుబోలిన తామర రేకులవలె ఎఱ్ఱనైన కన్నులు గలవాడు" అన్న అర్థం చెప్పాడు. అది విని శిష్యుడు దుఃఖించాడు. కారణమేమనగా "గురువుగారి కువ్యాఖ్యయే" అని అన్నాడు, 'మఱి నీవు మరొక అర్థం చెప్పగలవా?' అని గురువు గద్దించాడు. భగవానుని నేత్రాలు సూర్యకిరణాలచే వికసించిన తెల్లదామరలను బోలినవి' అని శిష్యుడు సమాధానం చెప్పాడు. గురువు నిరుత్తరుడైనాడు. కాని ఆ హరిద్వేషి శిష్యునిపై ద్వేషం పెంచుకొన్నాడు. కడకు శిష్యుణ్ణి తుదముట్టించవలె నన్నంతటి ఆవేశమతనికి కల్గింది. అతని హృదయక్షేత్రంలో విషబీజం పడింది.

ఇంతలో కాంచీపురరాజు పుత్రికను ఒక బ్రహ్మరాక్షసు డావేశించాడు. మహామాంత్రికుడుగా పేరొందిన యాదవప్రకాశుడు ఆ రాక్షసుని దూరీకరించబోయి ఆపని చేయజాలక భంగపడ్డాడు. రామానుజుడు ఆపని సులభంగా చేయగలిగాడు. రాజు సంతోషానికి అవధి లేదు. అతడు గురు శిష్యులనిరువురినీ ఘనంగా సత్కరించాడు. శిష్యుడు తన సత్కారసంభారాన్ని గురువుకే సమర్పించాడు. ఈ సంఘటనతో గురువుగారి ద్వేషం మిన్నుముట్టింది. విషబీజం అంకురించి పల్లవించింది. కాని రామానుజుని కీర్తికౌముది నలుదెసలా వ్యాపించింది.

## కాశీయాత్ర

యాదవప్రకాశుడు రామానుజుల నెట్లైనా హతమార్చాలని ఆత్మీయ శిష్యులతో చేరి కుట్రపన్నాడు. కాశీయాత్ర నెపంతో ఆశిష్యుణ్ణి వెంటబెట్టుకొని వంచకశిష్యులతో సహా బయలుదేరాడు. కాని గోవిందుడనే రామానుజుని సన్నిహితుడు గురువు కుట్రను పసిగట్టాడు.

రామానుజునికి విషయం ఎఱుక పరిచాడు. అప్పుడు మన కథానాయకుడు వారితో సహా వడిగా నడువజాలనట్లు నటించి వెనుక బడిపోయాడు. గురువు అతని కోసం వెదకి కనిపెట్టలేక పోయాడు. అడవిలో పులినోటిలో పడియుంటాడని భావించి వారు ముందుకు సాగిపోయారు. పైకి రామానుజుడు కనిపించలేదని విచారం నటిస్తూనే గురువు లోలోన సంతసించాడు.

అడవిలో ఒంటరియైన రామానుజుడు శ్రీవరదరాజస్వామిని స్మరించాడు. భగవానుడు కిరాతరూపంలో వచ్చి అతణ్ణి తెల్లవారేసరికి కాంచీపురం చేర్చి కనుమరుగై పోయాడు. భగవన్మహిమకూ, రామానుజునిపై స్వామికి గల కృపకూ ఇది నిదర్శనం.

## శ్రీకాంచీపూర్ణులు

రామానుజుడు తల్లి కాంతిమతి సూచన ననుసరించి కంచిలోనే ఉన్న శ్రీకాంచీపూర్ణుల చెంతకు పోయి జరిగిన సంగతి వివరించాడు. అది విని కాంచీపూర్ణులు 'నాయనా! నిన్ను శ్రీవరదరాజ స్వామి అనుగ్రహించాడు. ఆ కరివరదుని నిత్యం సేవించు' అని చెప్పాడు. రామానుజుడు ఆయన మాట పాటించాడు. శ్రీకాంచీపూర్ణుడు ద్విజేతరుడు. ఐననూ ఆత్మగుణసంపన్నుడు. శ్రీ వరదరాజస్వామి ఆభక్తాగ్రేసరునితో మాట్లాడేవారట! భగవంతుడు భక్తవత్సలుడు గదా!

## శ్రీయామునాచార్యులు

ఆకాలమున శ్రీరంగక్షేత్రంలో శ్రీయామునాచార్యులు అనే వైష్ణవ యతీశ్వరులు ఉండినారు. వారు విశిష్టాద్వైతసిద్ధాంత ప్రచారకులు. వారు పూర్వాశ్రమములో పాండ్యరాజ్యం పాలించిన మహామహులు. వీరు రచించిన 'సిద్ధిత్రయం' మొదలైన గ్రంథాలు వైష్ణవులకు పరమ ప్రమాణాలు.



ఒకసారి 'తిరువాయ్‌మొళి'ని శిష్యులకు బోధిస్తున్న సందర్భంలో శ్రీ యామునాచార్యులవారికి 'పొలిక పొలిక' అనే పాశురంలో 'ఒక మహాపురుషుడీ కాలంలో జన్మించినాడు' అన్న అర్థం స్ఫురించింది. ఎవరా మహానుభావుడని అన్వేషించగా 'శ్రీరామానుజులే' అని స్పష్టమయింది. అంతా భగవల్లీల!

వెంటనే శ్రీయామునమునులు మహాపూర్ణు లనే శిష్యునితో సహా రామానుజులను కలుసుకోవడానికై కంచికి వచ్చారు. వారిని దర్శించి పరమానంద పరవశులయ్యారు. భావికాలంలో విశిష్టాద్వైత సంప్రదాయాన్ని సుస్థిరం చేయగల మహాపురుషుడతడే అన్న నమ్మకం వారికి కలిగింది. బ్రహ్మసూత్ర గీతాదులకు భాష్యకర్త కాగలడన్న విశ్వాసంతో వారు తిరిగి శ్రీరంగం చేరుకొన్నారు.

యాదవప్రకాశుని యాత్రాబృందంలో ఉండిన గోవిందుడు కాశిలో గంగాస్నానం చేస్తుండగా శివలింగం చేతికి దొరికింది. యాదవప్రకాశుడది గమనించి 'ఆలింగాన్ని భక్తితో అర్చించు' అని అతనితో చెప్పాడు. గోవిందుడు దాని పూజలో పడి వైష్ణవాచారం వదలిపెట్టాడు. యాత్రనుండి తిరిగి వచ్చి స్వగ్రామమైన శ్రీమంగళం చేరాడు. అక్కడ లింగప్రతిష్ఠ చేసి శివపూజా ధురంధరుడయ్యాడు.

యామునాచార్యులు తాము రచించిన స్తోత్రరత్నాన్ని శ్రీమహాపూర్ణుల ద్వారా రామానుజులకు పంపారు. మహాపూర్ణులు కంచికి పోయి ఆస్తోత్రాన్ని శ్రీవరదరాజస్వామి సన్నిధిలో పఠిస్తుండగా రామానుజులు విన్నారు. అందలి–

*స్వాభావికానవధికాతిశయేశితృత్వం*
*నారాయణ! త్వయి న మృష్యతి వైదికః కః।*
*బ్రహ్మా శివః శతమఖః పరమస్స్వరాడి*
*త్యేతేఽపి యస్య మహిమార్ణవ విప్రుషస్తే॥* (స్తోత్రరత్నము)

అన్న శ్రీనారాయణపారమ్యం ప్రకటించే శ్లోకం విని ఆనందించి 'దాని రచయిత ఎవరు? ప్రశ్నించారు. శ్రీ యామునాచార్యులవారు అని తెలుసుకొని వారిని దర్శించాలని అభిలషించారు.

వెంటనే మహాపూర్ణులు రామానుజులను శ్రీరంగానికి పిలుచుకొని పోవడాని కుద్యుక్తులయ్యారు. వారు శ్రీరంగం చేరేసరికి శ్రీయామునాచార్యులు శరీరపరిత్యాగం చేసి పరమపదం చేరుకొన్నారు. మహాపూర్ణులు, రామానుజులు ఈ సంఘటనవల్ల మిక్కిలి చింతాపరవశులయ్యారు.

అప్పుడొక వింత జరిగింది. యామునాచార్యులవారి తక్కిన శరీరం ఉండవలసిన రీతిలో ఉండగా కుడిచేతి మూడు వ్రేళ్ళు మాత్రం ముడుచుకొని వున్నాయి. అది ఎందుకో ఎవరికీ అర్థం కాలేదు. అక్కడ చేరినవారు దానిని గూర్చి తలకొకరీతిగా మాట్లాడారు.

శ్రీయామునాచార్యులవారి ఆశయమేమిటో రామానుజులు ఊహించారు. "నేను విశిష్టాద్వైతవ్యాప్తికి పాటుపడతాను. జనులకు పంచసంస్కారాలందించి ద్రవిడవేదంలో, ప్రపత్తిలో విశ్వాసపరులనుగా చేస్తాను" అని ఉద్ఘోషించారు. ఒక వ్రేలు సాధారణ స్థితికి వచ్చింది.

మరల "బ్రహ్మసూత్రాలకు శ్రీభాష్యం వ్రాసి విశిష్టాద్వైత ప్రచారం చేస్తాను" అనగా రెండవ వ్రేలు మామూలు దశకు వచ్చింది.

మళ్ళీ 'సర్వ సద్గుణసంపన్నుడైన ఒక వైష్ణవునికి విష్ణుపురాణకర్త పరాశర మహర్షి పేరు పెట్టగలను" అని చెప్పేసరికి మూడవ వ్రేలు గూడా సహజస్థితికి వచ్చింది.

అది చూచి అచ్చటి జనులు ఆశ్చర్యచకితులయ్యారు. వైష్ణవులందరికీ రామానుజులపై భక్తి ప్రపత్తు లేర్పడ్డాయి. వారి మహిమ గుర్తింపబడింది.



కాని యామునాచార్యులు లేని శ్రీరంగంలో ప్రవేశించడానికి ఆయనకు మనసు రాలేదు. తిరిగి వారు కంచికి వచ్చి వరదరాజసేవలో నిమగ్నులయ్యారు. వారి తల్లి కాంతిమతి గూడ పరమపదం చేరింది. రామానుజులు కంచిలోనే కాలం గడుపసాగారు.

## రక్షకాంబ తప్పిదం

వారు కంచిలోనున్న కాంచీపూర్ణులనే గురువుగా భావించారు. ఒకసారి వారిని తమ యింటికి భోజనానికి ఆహ్వానించారు. భార్య రక్షకాంబను గురువుగారి విందుకు తగిన ఏర్పాటు చేయమన్నారు. కాంచీపూర్ణులను పిలుచుకొని రావడానికై వెళ్లారు.

ఇంతలో కాంచీపూర్ణులు మరొక దారిలో రామానుజుల యింటికి వచ్చారు. 'అమ్మా! నీ భర్త నన్ను భోజనానికి రమ్మన్నారు. త్వరగా వడ్డించు' అని రక్షకాంబను కోరారు. 'వారిని రానీండి' అని ఆమె బదులిచ్చింది. 'నేను వెంటనే వెళ్ళాలి, వడ్డించు' అని ఆయన మళ్ళీ తొందర చేశారు.

రక్షకాంబ ఆయనకు చావడిలో అన్నం వడ్డించింది. ఆయన త్వరగా భుజించి విస్తర తానే తీసి పారవైచి స్థలశుద్ధి చేసి వడివడిగా వెళ్ళారు.

రామానుజులు తిరిగి వచ్చారు. జరిగిన సంగతి తెలుసుకొన్నారు. చాలా ఖిన్నులయ్యారు. మళ్లీ వంట చేస్తున్న భార్యను 'అదెందుకు' అని ప్రశ్నించారు. 'శూద్రుడు భుజించగా శిష్టాన్నం మీకెలా వడ్డించేది? మీ కోసం మరల వంట చేస్తున్నాను' అని ఆమె సమాధానం చెప్పింది. అది విని రామానుజులు 'ఆమహాజ్ఞాని ఉచ్ఛిష్టం భుజించాలని ఆశించాను. నా ఆశ అడియాస అయ్యేటట్లు చేశావే' అని భార్యను చీకొట్టారు.

తదుపరి రామానుజులు కాంచీపూర్ణులను 'నారాయణాష్టాక్షరీ మంత్రం ఉపదేశించమని అర్థించారు. అందుకు వారు అది 'వర్ణధర్మ విరుద్ధం' అని అంగీకరించలేదు. 'అయితే నా అభీష్టాన్ని శ్రీవరదరాజ స్వామి నడిగి తెలుసుకోండి' అని రామానుజులు కాంచీపూర్ణుల నభ్యర్థించారు.

నాటిరాత్రి కాంచీపూర్ణులు 'శ్రీవరదరాజస్వామిని ఆవిషయమై అడిగారు. అందుకు స్వామి –

1. జగత్కారణమైన బ్రహ్మం నేనే.
2. శరీరానికీ, శరీరికీ భేదం కలదు.
3. ముముక్షువులకు ప్రపత్తిని మించిన మోక్షోపాయం లేదు.
4. నా భక్తులకు అంతిమ స్మృతితో పనిలేదు.
5. వారికి నేను దేహావసాన సమయమందే ముక్తినిస్తాను.
6. మహాత్ములైన మహాపూర్ణులను గురువుగా ఆశ్రయించు.

అని బదులు చెప్పారు. కాంచీపుర్ణులు ఆ మాటలు రామానుజులకు తెలియజేశారు. తన భావన కనుగుణంగానే భగవంతుడు చెప్పుట విని రామానుజులు అమందానందం పొందారు. మహాపూర్ణులను ఆశ్రయించడానికి శ్రీరంగానికి బయలుదేరారు.

## గురుత్వసిద్ధి

యామునాచార్యులు పరమపదించిన తరువాత శిష్యులు దుఃఖితులయ్యారు. వారు రామానుజులనే తమ సంప్రదాయానికి గురువుగా చేసుకోవాలని నిర్ణయించుకొన్నారు. మహాపూర్ణులతో ఆ సంగతి చెప్పగా వారు 'సరే' అన్నారు. వెంటనే వారందరూ కంచికి పయనమయ్యారు. దారిలో మధురాంతకంలో ఇరుపక్షాలవారు కలుసుకొన్నారు.



రామానుజులు మహాపూర్ణులకు సాష్టాంగంగా ప్రణమిల్లారు. పరమార్థోపదేశం చేయమని ప్రార్థించారు. 'కంచిలో ఉపదేశిస్తాను, పోదాం పద' అని కాంచీపూర్ణులన్నారు. అందుకు రామానుజులు 'స్వామీ! శరీరం క్షణభంగురం గదా! సత్కార్యాలను వాయిదా వేయడమెందుకు? ఇప్పుడే ఇక్కడే తప్తచక్రాంకనం చేసి అష్టాక్షరి నుపదేశించండి' అని ప్రార్థించారు. మహాపూర్ణులందు కంగీకరించారు.

విధ్యుక్తవిధానంతో మహాపూర్ణులు రామానుజులకు తప్త చక్రాంకనం ప్రసాదించారు. అష్టాక్షరి నుపదేశించారు. శ్రీవరదరాజుల అర్చా విగ్రహాన్ని నిత్యార్చనకై అనుగ్రహించారు. ఈ రీతిగా శ్రీరామానుజులు వైష్ణవసామ్రాజ్యానికి పట్టాభిషిక్తులయ్యారు.

గురువు శిష్యుణ్ణి ఆశీర్వదించి 'నాయనా! నీవల్ల వైష్ణవ సంప్రదాయం మూడు పూవులు, ఆరు కాయలుగా అభివృద్ధి చెందుగాక! ఈ సంప్రదాయం 'శ్రీరామానుజ దర్శనం' అని వ్యవహరింపబడుగాక!' అని అన్నారు.

అందరూ కంచి చేరారు. కాంచీపూర్ణులు జరిగినది విని సంతసించారు. ఆరునెలలు మహాపూర్ణులక్కడనే ఉండి రామానుజులకు రామాయణ, దివ్యప్రబంధాలు బోధించారు. శ్రీయామునాచార్యుల సంకల్పం అలా ఫలించింది. వైష్ణవులందరూ సంతసించారు.

## పత్నీ పరిత్యాగం

ఒకరోజు రామానుజులొక ద్విజబాలకునిచే తైలమర్దనం చేయించుకొని ఆబాలకునికి అన్నం పెట్టమని భార్యకు చెప్పారు. ఆమె వెంటనే 'అన్నం లేదు' అని చెప్పింది. రామానుజులు వెదుకగా అన్నం ఉన్నట్లు స్పష్టమయింది. భార్యను పిలిచి చీవాట్లు పెట్టారు.

మరొక రోజు ఆమె నీరు తేవడానికి బావికి పోయింది. మహాపూర్ణుల ధర్మపత్ని గూడ ఆ బావికే వచ్చింది. ఇరువురూ నీరు తోడుతుండగా మహాపూర్ణుల భార్య బిందె నీళ్ళు రక్షకాంబ బిందెలో పడ్డాయి. ఆమె కోపగించి బిందె నీరు క్రిందపోసి స్నానం చేసి మహాపూర్ణుల ధర్మపత్నిని నిందించింది. ఆమె కూడ తిరిగి తీవ్రంగా స్పందిస్తూ 'మావంశం తక్కువది కాదు. మీ ఇంట నుండడమే మేము చేసిన తప్పు. నీకింత గర్వం తగదు' అని సమాధానం చెప్పింది. ఇంటికిపోయి భర్తకు జరిగిన సంగతి వివరించింది.

రామానుజులు ఈ సంగతి తెలిస్తే భార్యపై ఆగ్రహిస్తారని భావించి మహాపూర్ణులు వెంటనే కంచి వదలి శ్రీరంగం వెళ్ళారు. తరువాత విషయం గ్రహించిన శ్రీరామానుజులు రక్షకాంబను తీవ్రంగా మందలించారు.

'ఈమె ఇప్పటికి మూడుసార్లు తప్పు చేసింది. నాకు అనుకూల కాదు. ఈమె నెట్లైన వదలించుకోవాలి' అని రామానుజులు నిర్ణయించు కొన్నారు.

కొంతకాలం తరువాత ఒకనాడు వరదరాజాలయములో రామానుజులుండగా ఒక విప్రుడు వచ్చి 'స్వామీ! ఆకలిగా నున్నది. అన్నం పెట్టించండి!' అని ప్రార్థించాడు. రామానుజులు అతని నింటికి పంపి నా భార్యతో నేను చెప్పినానని చెప్పి భుజించమని పంపారు. అతడు ఇంటికిపోయి తిరస్కారానికి గురి అయ్యాడు. తిరిగి వచ్చి విషయం రామానుజులకు వివరించాడు. అంతటితో ఎట్లైనా భార్యను పుట్టింటికి పంపివేయాలని నిర్ణయించుకొన్న రామానుజులు అందుకై ఉపాయం ఆలోచించారు. ఆపై ఆ విప్రుని చేతికి కొన్ని వస్తువులిచ్చి తిరిగి అతణ్ణి యింటికి పంపి ఇలా చెప్పమన్నారు–



'అమ్మా! మీ తమ్ముని పెండ్లికి మీ పుట్టింటివారు ముహూర్తం నిర్ణయించారు. మిమ్మల్ని పిలుచుకొని రమ్మన్నారు. ఇదిగో పసుపు, కుంకుమ, చీరె, జాబు' అని.

అతడట్లే చేశాడు. అది విని రక్షకాంబ సంతోషంతో ఉప్పొంగి పోయింది. అతనికి షడ్రసోపేతమైన భోజనం తయారు చేసి పెట్టింది. మూట, ముల్లె సర్దుకొని ప్రయాణానికి సిద్ధమయింది.

ఇంతలో రామానుజులింటికి వచ్చారు. వారికి సంగతి చెప్పి వారిని గూడా పయనం కమ్మన్నది. 'నీవు పో. నేను పనులు చూచుకొని వస్తాను' అని చెప్పి రామానుజులు భార్యను యింటి నుండి సాగనంపారు. భార్యాబంధం అలా వదలిపోయింది. శ్రీవరదరాజులే ఇక వారి సర్వస్వం అయ్యారు.

## సన్న్యాస స్వీకారం

తరువాత ఒక శుభముహూర్తాన రామానుజులు దండ కమండలువులు, ఇతరోపకరణాలు సంపాదించి శ్రీయామునాచార్యుల వారిని మనసా స్మరిస్తూ కాషాయాంబరధారణ చేశారు. ఆకసం నుండి కుసుమవృష్టి కురిసింది. ద్వాదశోర్ధ్వపుండ్రాలతో, కాషాయాంబరంతో భాసిల్లిన ఆ యతిరాజు దివ్య తేజో విరాజితులయ్యాడు.

శ్రీవరదరాజస్వామి కాంచీపూర్ణుల ద్వారా శ్రీరామానుజులను తన సన్నిధికి గౌరవమర్యాదలతో ఆహ్వానించుకొని వచ్చేటట్లు ఏర్పాటు చేశారు. 'యతిరాజ' అన్న బిరుదం అర్చకులద్వారా రామానుజులకు స్వామి అనుగ్రహించారు. గుడి ఆవరణలోనే ఒకకట్టడాన్ని మఠంగా

ఉపయోగించేటట్లు గూడా నిర్ణయమయింది. ఇప్పుడు రామానుజులు జగద్గురువులై శ్రీభగవద్రామానుజులుగా రూపొందారు.

కేశవయజ్వ తన పుత్రికను అనంతదీక్షితుడను వానికిచ్చి వివాహం చేసి యుండినాడు. అనంతదీక్షితుని కుమారుడే దాశరథి. అతడు సకల సద్గుణ విరాజితుడు, చక్కని విద్యావంతుడు. తన మేనమామ సర్వ జగత్పూజ్యుడైనాడని విని అతడు ఆయన చెంత శిష్యత్వం వహించాడు.

కూరేశుడనే మరొక విప్రుడు గూడ రామానుజుల శిష్యుడైనాడు. దాశరథి, కూరేశుడు – వీరిరువురు రామానుజుల దివ్యసన్నిధిలో వుంటూ వారికి సకల పరిచర్యలు కావిస్తూ రక్షకులయ్యారు. రామానుజులు వారికి తత్త్వోపదేశం చేశారు. వారి జీవితాలు అలా భగవదనుగ్రహానికి పాత్రము లయ్యాయి.

ఒకనాడు మఠంలో శ్రీభగవద్రామానుజులు భక్తితత్త్వంపై ఉపన్యసిస్తూ వుండినారు. గుడికి వచ్చిన యాదవ ప్రకాశుని తల్లి వారిని చూచింది. వారి ప్రబోధం విన్నది. ఆ తేజోనిధి పట్ల తన కుమారుడు అనుచితంగా ప్రవర్తించడం స్మృతికి దెచ్చుకొని చింతించింది. ఇంటికి పోయి కుమారునికి హితబోధ కావించింది. రామానుజులనాశ్రయించి దురిత దూరుడవు కమ్మని బోధించింది.

దేవరాజస్వామి కూడ యాదవ ప్రకాశునికి కలలో కనిపించి తల్లి చెప్పినట్లే చేయవలసిందిగా హెచ్చరించాడు. ఆపై ఈ విషయం కాంచీపూర్ణులతో ప్రస్తావించగా ఆయన కూడా వరదరాజస్వామి అభిమతం గ్రహించి యాదవ ప్రకాశుడు రామానుజుల నాశ్రయించుటే కర్తవ్యమని ఉపదేశించారు.



## శిష్యుడైన గురువు

ఆ మీదట యాదవ ప్రకాశుడు శ్రీభగవద్రామానుజుల నాశ్రయించి తన్ను క్షమించమన్నాడు. ఆయనకు శిష్యుడయ్యాడు. ఒకనాటి గురువు ఇప్పుడు తన శిష్యుణ్ణే తనకు గురువుగా చేసుకొన్న ఈ అద్భుత సంఘటన ఊహాతీతము గదా!

తదుపరి యాదవ ప్రకాశుడు శ్రీరామానుజులనుండి పంచసంస్కారాలు పొంది 'గోవిందదాసు' దన్న వైష్ణవనామంతో భాసించాడు. యతిధర్మ సముచ్చయం అను గ్రంథం రచించాడు. అందులో త్రిదండి సన్యాసుల విధివిధానాలను వివరించి ధన్యత నొందినాడు.

శ్రీరంగం వైష్ణవమతానికి మూలస్థానం. శ్రీయామునాచార్యులు అస్తమించిన తర్వాత అక్కడ ఆ మతప్రభ తగ్గింది. అందువల్ల కంచిలోని శ్రీరామానుజులను శ్రీరంగానికి పిలుచుకుపోవాలని వైష్ణవులు నిర్ణయించారు. శ్రీయామునమునుల పుత్రుడూ, ద్రావిడ వేదాంత తత్త్వజ్ఞుడూ అయిన వరరంగార్యులను వారు కంచికి పంపి శ్రీరామానుజులను పిలుచుకురమ్మన్నారు. ఆయన పోయి శ్రీరామానుజులకు వచ్చిన పని చెప్పారు. శ్రీవరదరాజస్వామి అనుమతి లేనిదే నేను కంచి వదలనని వారన్నారు. వరరంగార్యులు తన గానకౌశలంతో వరదరాజస్వామిని మెప్పించి స్వామి అనుమతితో శ్రీరామానుజులను శ్రీరంగానికి పిలుచుకొనిపోయారు. వారితో పాటు కూరేశుడు, దాశరథి గూడ పయనమైపోయారు. శ్రీరామానుజుల రాకకు శ్రీరంగవాసులందరూ సంతసించారు. వారికి ఘనంగా స్వాగతం పలికారు. యథోచిత మర్యాదలతో వారిని ఆహ్వానించారు. శ్రీరామానుజులు శ్రీరంగనాథుని సందర్శించి పులకించి పోయారు.

అక్కడ వారు శ్రీమహాపూర్ణులకు సాష్టాంగ వందనం చేశారు. శ్రీమహాపూర్ణులు 'పాలిక' అనే శ్రీశఠకోపుల పాశురంలో వర్ణించిన మహాపురుషుడవు నీవే. ఈ జనానీకాన్ని ఉద్ధరించి నీఅవతార ప్రయోజనం సాధించు' అని చెప్పారు. యథాశక్తి భాగవతధర్మ పరిరక్షణకై పాటుపడగలనని శ్రీరామానుజులు పలికారు. శ్రీరంగంలో ఉండి వైష్ణవులకు తత్త్వబోధ చేశారు.

గోవిందుడు శివభక్తుడైనాడని ముందే గ్రహించాము. శ్రీరామానుజులు తిరుపతిలో వున్న శ్రీశైలపూర్ణుల ద్వారా అతణ్ణి తిరిగి వైష్ణవమతంలోకి ప్రవేశింపజేశారు.

## మంత్రరాజ ప్రాప్తి

శ్రీరామానుజు లొకరోజు శ్రీమహాపూర్ణుల చెంతకు పోయి 'ద్వయ మంత్ర ముపదేశించుడని ప్రార్థించారు. వారి ప్రార్థన మేరకు శ్రీమహా పూర్ణులు ఆ మంత్రం ప్రసాదించారు. గీతార్థసంగ్రహం, సిద్ధి త్రయం ఇత్యాది యామునాచార్యుల గ్రంథాలను గూడా శ్రీరామానుజులు శ్రీమహాపూర్ణుల వద్ద అభ్యసించారు.

ఒకరోజు శ్రీమహాపూర్ణులు గోష్ఠీపురంలో వున్న శ్రీగోష్ఠీపూర్ణుల వారి పేరు ప్రస్తావించి వారివద్ద అభ్యసింపదగిన రహస్యార్థాలున్నాయని శ్రీరామానుజులకు తెలిపారు. వారి సూచన మేరకు శ్రీరామానుజులు గోష్ఠీపురం చేరి శ్రీగోష్ఠీపూర్ణులను సందర్శించి వారికి సాష్టాంగ ప్రణామం చేశారు. మంత్ర, మంత్రార్థాలు, రహస్యార్థాలు బోధించవలసినదిగా సవినయంగా ప్రార్థించారు. అందుకు వారు 'నాయనా! ఈ కాలంలో మంత్ర మంత్రార్థ గ్రహణానికి తగిన అధికారులు లేరు' అని చెప్పి విముఖత ప్రకటించారు. శ్రీరామానుజులు కోరిక తీరకనే తిరిగి శ్రీరంగం విచ్చేశారు.



కాని జిజ్ఞాస నశించలేదు. పట్టు వీడక మరల గోష్ఠీపురం పోయారు. కాని బోధ లబ్ధం కాలేదు. శ్రీరామానుజులు చింతాక్రాంతులయ్యారు. కాలక్రమంలో వారి జిజ్ఞాస అధ్యవసాయం దృఢమైనవని శ్రీగోష్ఠీపూర్ణులు గ్రహించారు. అప్పటికి శ్రీరామానుజులు పదునెనిమిది పర్యాయములు గోష్ఠీపురానికి రాకపోకలు సాగించారు. చివరికి శ్రీరామానుజుల కోరిక తీర్ప నిశ్చయించుకొని ఒంటరిగా త్రిదండ యజ్ఞోపవీతాలతో తన చెంతకు రావలసినదిగా కబురంపారు.

అది విని శ్రీరామానుజులు సంతుష్టాంతరంగులై కూరేశ, దాశరథులు వెంటరాగా గోష్ఠీపురానికి వెళ్ళారు. మంత్రోపదేశం చేయుడని అర్థించారు. 'నిన్నొకనినే రమ్మంటినే. వీరినెందుకు పిలుచుకొని వచ్చావు?' అని శ్రీగోష్ఠీపూర్ణులు ప్రశ్నించారు. అందుకు శ్రీరామానుజులు 'స్వామీ! మీరు త్రిదండోపవీతాలతో రమ్మన్నారు. వీరిరువురు నాకు త్రిదండోపవీత సదృశులు. కూరేశుడు ఉపవీతం, దాశరథి దండము' అని చెప్పారు. 'అయితే నేను చెప్పే మంత్రములను వీరిరువురికి తప్ప వేరెవరికీ ఉపదేశించరాదు' అని శ్రీగోష్ఠీపూర్ణులన్నారు. ఆచార్యులందుకు సమ్మతించారు.

శ్రీగోష్ఠీపూర్ణులు శ్రీనారాయణాష్టాక్షరీ మంత్రాన్ని శ్రీరామానుజులవారి కుపదేశించారు. ఆనందపరవశులైన శ్రీరామానుజులు గురువుగారికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి భూరి దక్షిణలు సమర్పించి వారి అనుమతితో శ్రీరంగం చేరారు.

'స్వయం తీర్ణః పరాంస్తారయతి' అన్నట్లు శ్రీరామానుజులవారికి తాను తరించి ఇతరులను గూడ తరింపజేయాలన్న అభిప్రాయం దృఢంగా వుండేది. అందువల్ల గురువు వద్ద మంత్రాన్ని ఇతరులకు ఉపదేశించనని చేసిన శపథాన్ని లెక్కపెట్టకుండా నగరంలోని

శ్రీనరసింహస్వామి ఆలయం గోపురంపై కెక్కి బిగ్గరగా శ్రీనారాయణాష్టాక్షరీ మంత్రాన్ని వైష్ణవులకందరికీ ఉపదేశించారు.

ఇది శ్రీగోష్ఠీపూర్ణులకు తెలిసింది. ఆయన శ్రీరామానుజుల చెంతకు వచ్చి –

గో :– ఏమి నాయనా! గురుద్రోహం చేశావే.

రా :– అవును గురుద్రోహినే.

గో :– అయితే గురుద్రోహికి నరకమే గతి అని నీకు తెలియదా?

రా :– తెలియును.

గో :– మరి ఎందుకు చేశావు?

రా :– స్వామీ! గురుద్రోహంవల్ల నేనొక్కడనే నరకానికి పోతాను. కాని ఈ మంత్రం వల్ల అనేకులు తరిస్తారు గదా!

అది విని శ్రీగోష్ఠీపూర్ణులు ఆనందంతో పొంగిపోయి శిష్యుని కౌగలించుకొని 'నాయనా! నీకున్న విశాల హృదయం నాకు లేక పోయినది. నీవు 'ఎంబెరుమానారువు' (నాకు నాథుడవు) అని అభినందించారు. అప్పటినుండి శ్రీరామానుజులవారికి 'ఎంబెరుమానార్' అన్న వ్యవహారం సార్థకమయింది. నాటి నుండి 'వైష్ణవదర్శనం', 'రామానుజదర్శనం'గా పేరొందగలదని శ్రీగోష్ఠీపూర్ణులు అచ్చటివారితో అన్నారు.

ఆ తరువాత శ్రీగోష్ఠీపూర్ణులు దయామయులై శ్రీరామానుజులకు చరమశ్లోకం కూడా ఉపదేశించారు. ఆపైన శ్రీరామానుజులు నెల రోజులు ఉపవసించి దీక్ష వహించిన కూరేశునకు కూడా చరమశ్లోక ముపదేశించారు. దాశరథి ఉపదేశం కోరారు. రామానుజులు అతణ్ణి శ్రీగోష్ఠీపూర్ణుల చెంతకే పొమ్మన్నారు. అతడక్కడికి పోగా 'నీ విద్యా – ధన – అభిజన – మదత్రయం ఉడిగిన తరువాత



శ్రీరామానుజులే నీకు ఉపదేశించగలరు' అని చెప్పి దాశరథిని త్రిప్పిపంపారు.

తిరిగి తన చెంతకు వచ్చిన దాశరథిని వారు 'గురుపుత్రిక అత్తవారింటికిపోయి వారికి పరిచర్య చేస్తూ వుండు' అని నియమించారు. అతడలా చేసి తాను మద విముక్తుడ నయ్యానని నిరూపించుకొన్నాడు. అపుడు శ్రీరామానుజులు అతనికి చరమశ్లోకోపదేశం చేశారు.

## భగవద్విషయం

ఒకసారి శ్రీగోష్ఠీపూర్ణులు శ్రీరామానుజులకు మాలాధరుల వద్ద శఠకోపగీతి వ్యాఖ్య – భగవద్విషయం వినుమని చెప్పి పోయారు. అట్లే శ్రీరామానుజులు మాలాధరుల వద్ద శ్రవణం చేస్తుండగా ఒక్క గాథకు మాలాధరులు తగిన అర్థం చెప్పలేదు. శ్రీరామానుజులు ఆక్షేపించారు. తాను వేరే అర్థం చెప్పారు. అందుకు కోపించి మాలాధరులు అర్థం చెప్పడం నిలిపివేశారు.

శ్రీగోష్ఠీపూర్ణుల కిది తెలిసింది. విచారించగా 'నేను చెప్పిన అర్థం సరి కాదు' అని రామానుజు డాక్షేపించినాడు. అందువల్ల 'మానితి' నని మాలాధరులు చెప్పారు. అప్పుడు శ్రీగోష్ఠీపూర్ణులు 'రామానుజులు సామాన్యులు కారు. ఆదిశేషుని అవతారమూర్తులు. వారు చెప్పిన అర్థమే సరి అయినది' అని చెప్పారు. అందుకు సమ్మతించి మాలాధరులు మరల భగవద్విషయం శ్రీరామానుజులకు బోధించారు.

మాలాధరుల సలహాపై శ్రీయామునాచార్యుల పుత్రులైన వరరంగార్యుల వద్ద శ్రీరామానుజులు ఆరుమాసాలు శుశ్రూష చేశారు. అప్పుడు వరరంగార్యులు వారికి ఆచార్య ప్రతిపత్తిలోని అంతరార్థం బోధించారు.

ఈ రీతిగా భగవద్రామానుజులు శ్రీశైలపూర్ణులు, శ్రీగోష్ఠీపూర్ణులు, శ్రీమాలాధరులు, శ్రీవరరంగార్యులు – వీరందరివద్ద విద్యారహస్యాలభ్యసించి సార్థకనామధేయులయ్యారు.

## విషప్రదానం

శ్రీరంగనాథాలయం శ్రీరామానుజుల ఏలుబడిలోకి వచ్చింది. అక్కడి అర్చకులు దైవద్రవ్యాపహరణమునకు అలవాటుపడి వుండినారు. ఆచార్యుల ఆధిపత్యంలో వారి ఆటలు సాగలేదు. అందువల్ల వారు శ్రీరామానుజులను హతమార్చడానికి కుట్ర పన్నారు. వారి కాపట్యానికి లోనైన ఒక ద్విజుడు తన భార్యతో భిక్షకు వచ్చిన ఆచార్యులకు విషం కల్పిన అన్నం పెట్టమని చెప్పాడు. ఆమె అట్లే చేసి కన్నుల నీరు గ్రమ్మగా వారికి నమస్కరించింది. శ్రీరామానుజులు ఆసంకేతం గమనించి విషమిశ్రితాన్నం పారవైచి ఆనాడు కావేరీ జలాలతోనే ఆకలి తీర్చుకొన్నారు.

ఇది తెలిసి శ్రీగోష్ఠీపూర్ణులు శ్రీరామానుజులను చూడవచ్చారు. మండుటెండలో వచ్చిన గురువుకు శ్రీరామానుజులు కాలే ఇసుకలోనే క్రిందపడి సాష్టాంగ నమస్కారం చేశారు. శ్రీగోష్ఠీపూర్ణులు అప్పటినుండి శిష్యుల చేతనే వంట చేయించుకొనునట్లు ఏర్పాటు గావించారు.

మరొకసారి అర్చకుడొకడు విషమిశ్రితమైన తీర్థం ఇచ్చాడు. అది తెలిసి కూడా పుచ్చుకొన్న ఆచార్యులకు దానివల్ల భగవత్కృపచే అపకారం జరగలేదు. ఇలా ఎన్నో కుతంత్రాలు జరిగినా శ్రీరామానుజులు నిరపాయంగా ఉండగలిగారు. వారు భగవద్రక్ష గలవారు కదా! శత్రువులను గూడా ఆచార్యులు కరుణించి వదలివేశారు.



## యజ్ఞమూర్తి పరాజయం

యజ్ఞమూర్తి అనే విద్వాంసుడు అద్వైత సన్న్యాసి. శ్రీరామానుజుల కీర్తిని విని వారిని వాదంలో ఓడించడానికని అనేక శాస్త్రగ్రంథాలు తీసుకొని వచ్చాడు. శ్రీరామానుజులు వాదానికి సిద్ధమయ్యారు. 'నేను ఓడితే నీమతం స్వీకరించి నీ పాదములు శిరసావహిస్తాను' అని యజ్ఞమూర్తి అన్నారు. 'నే నోడితే నావద్దనున్న గ్రంథాలనన్నింటినీ త్యజించగల'నని శ్రీరామానుజులన్నారు. ఇలా ప్రతిజ్ఞలు కావించి వాదానికి దిగారు. యజ్ఞమూర్తి అసాధారణ పండితుడు. వాదంలో శ్రీరామానుజులే పరాజితులయ్యే సూచనలు కానవచ్చాయి. వారు శ్రీవరదరాజస్వామికి శరణాగతులై విషయం చెప్పారు. వరదుడు కలలో కనిపించి అభయహస్తమిచ్చి ఆ మహాపండితుడు ఓడిపోయి నీకు శిష్యుడై విశిష్టాద్వైత మత ప్రచారానికి ఉద్యమించగలడు అని చెప్పాడు. దానితో యతిరాజుకు ధైర్యం వచ్చింది.

మరునాటి వాదంలో శ్రీరామానుజులు యజ్ఞమూర్తిని––

"జ్ఞానరూపం పరం బ్రహ్మ
తన్నివర్త్యం మృషాత్మకమ్ ।
అజ్ఞానం చేత్తిరస్కుర్యాత్
*కః ప్రభుస్తన్నివర్తకః?" ॥*

అని ప్రశ్నించారు "జ్ఞానస్వరూపుడైన బ్రహ్మయే మాయకు లోనైతే ఇక దానిని తొలగించేవాడెవడు?" అని ఆ ప్రశ్నకు అర్థం.

ఇందుకు యజ్ఞమూర్తి సమాధానం చెప్పలేక యతిరాజు పాదాలకు ప్రణమిల్లి విశిష్టాద్వైతం స్వీకరించి పంచ సంస్కారాలు

పొందాడు. 'దేవరాజముని' అని అతనికి నామకరణం జరిగింది. 'అరుళాళప్పెరుముళెంబెరు మాణర్' అని కూడా ఆయనను అంటారు. ఇతడు శ్రద్ధాభక్తులతో వైష్ణవ మత ప్రచారం చేసి ప్రమేయసారం, జ్ఞానసారం వంటి గ్రంథాలు గూడా రచించి కీర్తి పొందాడు.

## అనంతార్యులు

'తిరువాయ్‌మొళి' లో ఒక పాశురంలో జీవితమంతా శ్రీనివాసుని కైంకర్యం చేస్తూ గడపాలి అని బోధించడమయింది. ఇది 'ఎలా చేయాలి' అని శ్రీరామానుజులు వివరించారు. తిరుమలలో పుష్పవనం నిర్మించి స్వామికి తులసీ పుష్పకైంకర్యం ఎవరు చేయగలరు? అని శిష్యులను ప్రశ్నించారు. అనంతార్యులనే వైష్ణవ శిఖామణి అందు కంగీకరించి ముందుకు వచ్చాడు. శ్రీరామానుజుల అనుమతితో ఆయన తిరుమలకు పోయి ఆ కైంకర్యం త్రికరణశుద్ధిగా నెరవేర్చాడు.

## కార్పాసారామలక్ష్మి

దివ్యదేశ సందర్శన యాత్రకై పోయి ఒకసారి శ్రీరామానుజులు అష్ట సహస్ర గ్రామం చేరుకొన్నారు. అక్కడ యజ్ఞేశుడనే ధనిక వైష్ణవుడు తాను వచ్చినానని చెప్పి పంపినా గౌరవించి ఎదురు రాలేదు. శ్రీరామానుజులు వరదార్యుడనే ధనహీనుడైన భక్తుని యింటికి చెప్పకనే వెళ్ళారు. కార్పాసారామలక్ష్మి అనే ఆ యిల్లాలు జీర్ణవస్త్ర ధారియై వెలుపలికి రావడానికి సిగ్గు పడింది. అది గ్రహించి ఆచార్యులు తమ ఉత్తరీయమును ఆమెపై పడునట్లు విసరివేశారు. అది చుట్టుకొని వెలికి వచ్చి ఆమె భక్తి ప్రపత్తులతో ఆచార్యులవారిని అర్చించింది. ఆతిథ్యమివ్వడానికి యింట సరకులు లేవు. భర్త ఇంకా ఇంటికి రాలేదు. పాపం చేసియైనా గురుమర్యాద చేయడం ధర్మమని ఆమె భావించింది.



తన్ను పూర్వం కామించి యుండిన కోమటి ఇంటికి పోయి ఆ రాత్రి కతని కోరిక తీరుస్తానని చెప్పి-- అతని వద్ద సరుకులు తెచ్చి ఆతిథ్యం పూర్తి చేసింది. ఇంతలో వరదార్యుడు వచ్చాడు. ఆమె జరిగిన సంగతి అతనికి వివరించింది. అతడందుకు సంతసించి భార్య నభినందించాడు. ఆ రాత్రి సతిని వెంట బెట్టుకొని వైశ్యుని యింటికి పోయాడు. వారిని చూడగానే కోమటి మనస్సు మారింది. వారి పాదాలపై బడి క్షమించ మన్నాడు. తరువాత ఆచార్యుల నాశ్రయించి పునీతుడయ్యాడు.

ఆపై తదీయారాధన సరిగా నిర్వహించని యజ్ఞేశునికి హితబోధ చేసి ఆచార్యులు కంచి చేరారు.

## తిరుపతి యాత్ర

అటుపిమ్మట శ్రీకాంచీపూర్ణులతో సహా వైష్ణవ సంఘం వెంట నడుస్తుండగా ఆచార్యులు వేంకటాచలం చేరుకొన్నారు. కపిలతీర్థమనే నామాంతరం కల దివ్యసూరి తీర్థంలో స్నానం చేశారు. తిరుపతిలో ఆచార్యులున్నారని తెలుసుకొని 'విట్ఠలదేవ భూపతి' అనే రాజు వచ్చి వారిని సేవించి దక్షిణలు, అగ్రహారంతో సహా సమర్పించాడు.

తదుపరి తిరుమలలోని అనంతార్యుడు మున్నగువారు వచ్చి ఆచార్యులను కొండపైకి ఆహ్వానించారు. అదిశేషుని రూపాంతరమైన కొండపై కాలుమోపుటకు ఆచార్యులిష్టపడలేదు. కాని భక్తుల నిర్బంధంపై తుదకు సమ్మతించారు.

శ్రీశైలపూర్ణులు ఆచార్యులకు స్వామి తీర్థప్రసాదాలు తెచ్చి యిచ్చారు. "మీరే ఎందుకు తెచ్చారు? ఒక బాలకుని పంపరాదా?" అని ఆచార్యులు ప్రశ్నించగా "నేనే అందరికంటె చిన్నవాడనని" వారు సమాధానం చెప్పారు. అది విని ఆచార్యులు ఎంతో సంతోషించారు.

తిరుమల చేరి యతిరాజు తిరువీథుల ప్రదక్షిణం చేశారు. అనంతార్యుల తోట పరికించారు. వరాహస్వామికి ప్రణమిల్లారు ధనుర్మాస శుక్ల పక్ష ద్వాదశినాడు స్వామి పుష్కరిణిని సేవించి గుడిలో ప్రవేశించారు. శ్రీ వేంకటేశ్వరమూర్తిని దర్శించి తీర్థం, శఠకోపం కైకొన్నారు. మూడు దినాలు తిరుమలపై ఉండి ఆపై కొండ దిగారు. శ్రీశైలపూర్ణుల యింట నున్న గోవిందుణ్ణి చూచి సంతసించారు.

శ్రీశైలపూర్ణులు ఆరుమాసాలు ఆచార్యులవారికి రామాయణ విశేషాలు బోధించారు. తరువాత గోవిందుని వెంట దీసుకొని ఘటికాచలం మీదుగా కంచి చేరారు. ఆపై కొంతకాలానికి శ్రీరంగం వెళ్ళారు. గోవిందుడు మిక్కిలి శ్రద్ధాభక్తులతో ఆచార్యుల సేవ చేశాడు. తుదకు గృహస్థధర్మం త్యజించి సన్న్యాసం స్వీకరించాడు.

## కాశ్మీర గమనం

శ్రీయామునాచార్యులవారు దేహం చాలించినప్పుడు ఆచార్యులు బ్రహ్మసూత్ర భాష్యం వ్రాస్తానని మాట యిచ్చారు. దాన్ని వ్రాయడానికి బోధాయన మహర్షికృతవృత్తిని చూడాలి. అందుకై ఆచార్యులు కూరేశునితో గూడి కాశ్మీరానికి పోయారు. అక్కడి పండితులు బోధాయన వృత్తిని ఇవ్వడానికి నిరాకరించారు. శ్రీరామానుజులు విచారగ్రస్తులయ్యారు. అది చూచి కూరేశుడు "స్వామీ! విచారించకండి! నేనిక్కడికి వచ్చి బోధాయనవృత్తిని మొత్తం పరికించాను. అందలి విషయములు నేను చెప్పగలను" అన్నాడు. అందుకు ఆచార్యులు సంతోషించారు.

## శ్రీ భాష్య రచన

పిమ్మట శ్రీరంగం చేరి కూరేశునిద్వారా బోధాయన వృత్తిలోని విషయాలు అవగతం చేసుకొని అద్వైత వాదాన్ని ఖండిస్తూ



బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాశారు. అదే శ్రీభాష్యమని ప్రసిద్ధి గాంచింది. అంతేకాక వేదాంతదీపం, వేదాంతసారం, వేదార్థ సంగ్రహం, గీతాభాష్యం మొదలైన గ్రంథాలను గూడా రచించారు. ఆచార్యులవారు చెబుతుండగా కూరేశుడు లిపిబద్ధం చేశాడు.

## దక్షిణ దేశ యాత్రలు

పిమ్మట శిష్యుల అభ్యర్థన మన్నించి ఆచార్యులవారు దక్షిణ దేశయాత్రలు చేశారు. దివ్య స్థలాలు సేవించారు. కురుకాపురి మొదలైన స్థలాలను సందర్శించారు. అలా సంచరిస్తూ అనేక సన్న్యాస పీఠాలు, 74 గృహస్థ మఠాలు స్థాపించారు. కేరళ ప్రాంతానికి పోయి పద్మనాభస్వామిని సేవించారు. అక్కడ రామానుజపీఠం స్థాపించారు. పిదప ద్వారక, మథుర, బృందావనం, సాలగ్రామం, అయోధ్య, నైమిశారణ్యం, పుష్కరం మొలైన క్షేత్రాలు సందర్శించారు. కాశ్మీరానికి పోయి శారదాపీఠం చేరారు.

అక్కడ శారదాదేవి ఆచార్యులవారి బ్రహ్మసూత్రభాష్యాన్ని శ్లాఘించింది. అక్కడి పండితప్రవరులు, రాజులు వారిని సత్కరించి సంభావించారు.

అటనుండి కాశీనగరం మీదుగా పూరీజగన్నాథక్షేత్రం చేరారు. అక్కడ పాంచరాత్రాగమానుసారంగా పూజావిధానం ఏర్పాటు చేయాలనుకొన్నారు. శ్రీ జగన్నాథస్వామి అందుకు సమ్మతించలేదు.

అటనుండి ఆచార్యులు శ్రీకూర్మం మీదుగా సింహాచలం చేరారు. అక్కడ 'కృష్ణమార్యుడు' అనే ఒక కవి అహంకారాన్ని హరింపజేసి వారిని అనుగ్రహించారు.

సింహాచలంనుండి అహోబిలం చేరుకొని అచ్చట శ్రీనరసింహ స్వామివారిని సేవించారు. అటనుండి తిరుమలకు వేంచేశారు. అక్కడి స్వామి విష్ణువా? శివుడా? అన్న వాదోపవాదాలు అప్పుడు వ్యాప్తిలో ఉండినవి.

శైవులకు, వైష్ణవులకు విగ్రహ విషయంలో అభిప్రాయభేదాలు ఏర్పడడానికి ముఖ్య కారణం విగ్రహంలో శంఖచక్రాదులుగాని, శూల డమరుకాలు గాని లేకపోవడమే.

## విష్ణుక్షేత్రంగా తిరుమల

తిరుమల చేరుకొన్న ఆచార్యులు విషయం గమనించి ఇరుపక్షాలనూ పిలిపించి-- "త్రిశూల డమరుకాలు, శంఖచక్రాలు దేవుని ముందుంచి మనం వెళ్ళిపోదాం. దేవుడు ఏ చిహ్నాలు ధరిస్తే ఆ మూర్తిగా భావించి ఆరాధించుదాం" అని చెప్పారు. ఉభయ పక్షాలూ అందు కంగీకరించాయి. వారు చెప్పినట్లే చేసి అందరూ తలుపులు బంధించి వెళ్ళారు. మరునాటి ప్రాతఃకాలాన అందరూ గుడిలోకి పోయి చూడగా స్వామి శంఖచక్రాలు పరిగ్రహించిన వైనం కానవచ్చింది. శైవులు లజ్జితులై అటనుండి వెళ్ళిపోయారు.

ఆచార్యులు పరమానందం పొందారు. స్వామికి మంగళా శాసనం చేశారు. స్వర్ణలక్ష్మిని వక్షస్థలంపై ధరించడానికి సమర్పించారు. నాటినుండి శ్రీనివాసునికి మామగా, గురువుగా శ్రీరామానుజాచార్యుల వారు ప్రశస్తి గాంచారు.

ఆ తరువాత ఆచార్యులు కంచి, మధురాంతకం మీదుగా పోయి క్రమంగా శ్రీరంగం చేరుకొన్నారు.



ఆచార్యులవారికి కూరేశుడు మిక్కిలి ఆప్తుడు. అతడు కంచి వద్ద 'కూర' గ్రామాధిపతిగా నిత్యం అన్నదానం చేసే త్యాగి. సహజంగా సంపన్నుడు, విద్యావంతుడు.

ఒకనాడు కూరేశుని అతిథిశాల తలుపులు మూసివేసే శబ్దం శ్రీరంగంలోని రంగనాయకికి వినిపించింది. కూరేశుని త్యాగం గూర్చి తెలిసికొని ఆదేవి అతణ్ణి చూడాలనుకొన్నది. కాంచీపూర్ణులద్వారా అతణ్ణి శ్రీరంగానికి రప్పించింది. కూరేశుడు సర్వం పరిత్యజించి భార్యతో, కట్టుబట్టలతో శ్రీరంగం బయలుదేరి వెళ్ళాడు. కూరేశుడు శ్రీరంగం వచ్చినాడని విని ఆచార్యులవారు ఎంతో సంతోషించారు.

కూరేశుడు శ్రీరంగంలో ఉంఛవృత్తితో జీవించేవాడు. ఒకనాడు కుంభవృష్టి కారణంగా ఇల్లు వదలలేక పోయాడు. నిరాహారిగానే పడుకొన్నాడు.

గుడిలో శ్రీరంగనాథుని నైవేద్య ధ్వని వినిపించింది. కూరేశుని ధర్మపత్ని ఆండాళమ్మ ఆ ధ్వని విని "నీ భక్తుడు పస్తుండగా నీకెట్లు షడ్రసోపేత భుక్తి ఇష్టమైనది" అని మొరపెట్టింది. అంతట స్వామి ఒక ఆలయాధికారికి కలలో కనిపించి కూరేశునికి ప్రసాదం పంపమని ఆనతిచ్చారు. ప్రసాదం స్వీకరించి కూరేశుడు ఆనందించాడు. కాని భార్య మొర పెట్టుటచే అలా జరిగిందని తెలుసుకొని "జగత్పితను మనం అట్లా అనవచ్చునా" అని భార్యను మందలించి భుక్తశేషం ఆమెకు ఇచ్చాడు.

## పరాశర వ్యాస భట్టారకులు

ప్రసాదశేషం స్వీకరించిన ఆమె గర్భవతియై ఇద్దరు కుమారులను ప్రసవించింది. అది తెలిసి ఆచార్యులు ఆనందించారు.

ఆ బిడ్డలకు "పరాశరభట్టారకుడు, వ్యాసభట్టారకుడు" అని నామకరణం కావించారు. ఆనాడు శ్రీయామునాచార్యులవారి కిచ్చిన మాటను ఆచార్యులవారు ఆ విధంగా పరిపాలించారు.

పరాశరభట్టు అసమాన మేధాసంపత్తి గలవాడు, ఏకసంధాగ్రాహి, వేద వేదాంగాది సమస్త విద్యలలో ఆరి తేరినవాడు. అతడొకనాడు బాలుడుగా నున్నప్పుడే 'సర్వజ్ఞ భట్టు' అను పండితుని చూచి పిడికిలినిండ ఇసుక పట్టుకొని "మీరు సర్వజ్ఞులు గదా! ఈ ఇసుక పరిమాణ మెంతో చెప్పండి?" అన్నాడు. పండితుడు బదులు చెప్పలేక పోయాడు. "అయ్యో! ఇది పిడికెడు ఇసుక" అని చెప్పలేరా? అని పరిహాస మాడినాడు. అతని మేధాశక్తికి సర్వజ్ఞుడు ఆశ్చర్య చకితుడయ్యాడు. యుక్తవయస్కుడైన పరాశరభట్టు ఆచార్యులవారి అనుమతితో వివాహం చేసుకొని శ్రీరంగంలోనే ఉండినాడు.

## ధనుర్దాసు - హేమాంబ

దినదినానికీ భగవద్రామానుజుల కీర్తి నలుదెసలకూ వ్యాపించింది. నిచుళా నగరంలో ధనుర్దాసుడనే ఒక మల్లుడుండే వాడు. 'హేమాంబ' అనే నట్టువకత్తె అతని భార్య. ఆమె అతిలోక సుందరి. మల్లుడామెను మిక్కిలి ప్రేమతో చూచుకొనేవాడు.

ఒకసారి శ్రీరంగనాయకస్వామికి వసంతోత్సవం జరిగింది. ఉత్సవ సందర్శనానికై మల్లుడు హేమాంబతో గూడా శ్రీరంగానికి వచ్చాడు. ఆమె ఎండలో కందిపోతుందేమోనని గొడుగు పట్టి ఆమె చెంతనే నడుస్తూ పోతున్నాడు.

కావేరిలో స్నానంచేసి వస్తున్న ఆచార్యులవారు ఈ దృశ్యం చూచారు. అలా గొడుగు పట్టి నడుస్తున్న అతడెవరు? అని అడిగారు. అతని సంగతి తెలిసినవారు ఆచార్యులకు విషయం చెప్పారు.



అయ్యో! ఏ మాత్రం సిగ్గులేక అతడు బహిరంగంగా అలా ప్రవర్తిస్తున్నాడే! అనుకొని అతని ప్రేమను శ్రీరంగనాయకస్వామి మీదికి త్రిప్పాలని సంకల్పించారు. తన చెంతకు రావలసిందిగా ధనుర్దాసుకు కబురంపారు. అతడు వచ్చాడు. నీ సమాచారమేమి? అని ఆచార్యులు అడిగారు. అతడు తన సంగతి చెప్పాడు.

ఆచార్యులు :-- "నడి వీథిలో ప్రియురాలికి గొడుగు పట్టి నడవడం తగునా?"

ధను :-- ఆచార్యా! నా భార్య అత్యంత సుకుమారి. ఆమె కన్నులు పద్మ దళాలను పోలినవి. ఎండకామె ముఖం వాడిపోతుంది. అందుకలా చేస్తున్నాను. ఆమె నా సర్వస్వం.

ఆచార్యులు :-- నీ మాట మంచిదే. కాని నేను నీ భార్య నేత్ర సౌందర్యంకంటే ఎక్కువ సౌందర్యం కల నేత్రాలను చూపిస్తాను. వస్తావా?

ధను :-- ఆచార్యా! తప్పక వస్తాను. అంతకంటే నాకు కావలసినదేముంది? నేను సౌందర్యారాధకుణ్ణి.

ఆచార్యులు వెంటనే అతణ్ణి శ్రీరంగనాథస్వామి చెంతకు తీసుకుపోయారు. ఆ దేవుడు కమలదళాక్షుడు. స్వామి దివ్య మంగళ విగ్రహం చూడగానే ధనుర్దాసు ఆనందతుందిలుడైనాడు. స్వామి నేత్రాలు అతణ్ణి అతిమాత్రంగా ఆకర్షించాయి.

అప్పుడు ఆచార్యులు "నాయనా! ఈ స్వామి నయన సౌందర్యం చూచావా? ఎలా ఉన్నది?" అని ప్రశ్నించారు. "స్వామీ! మీమాట నిజం. ఈ దేవుని రూపం జగత్సమ్మోహకం. ఈ నేత్రాలు నిరుపమ సౌందర్యఖనులు. ఇక నేను ఈ దేవుణ్ణి వదలను. నా

జీవితం ఇక్కడే గడుపుతూ స్వామిని సేవించే భాగ్యం ప్రసాదించండి. నా విషయలోలత్వానికి సిగ్గుపడుతున్నాను. మీరే నన్ను ఉద్ధరించాలి” అంటూ వారి పాదాలపై వ్రాలాడు.

ఆచార్యులు అతణ్ణి అనుగ్రహించి శ్రీరంగంలో నివసించేటట్లు, స్వామిని సేవించేటట్లు అనుమతించారు. ఇలా ధనుర్దాసు భగవత్తత్పరుడై భక్తాగ్రేసరుడై ఆచార్యుల శిష్యులలో ప్రముఖుడయ్యాడు. అతని కాచార్యులు పంచ సంస్కారాలు గల్గించి మంత్రోపదేశం కావించారు.

ధనుర్దాసులో వచ్చిన మార్పు హేమాంబకు బాధకమైంది. ఎలాగో శోకం నిగ్రహించుకొని ఒకనాడు ఆచార్యుల చెంతకు వచ్చి వారి పాదాలపై వ్రాలింది. ఆచార్యులు కరుణించి ఆమెను గూడా శిష్యురాలిగా పరిగ్రహించి పంచ సంస్కారవతిని చేశారు. ఇప్పుడు హేమాంబా ధనుర్దాసులిరువురూ భక్తాగ్రగణ్యులై విలసిల్లి ఆచార్యులవారికి ప్రీతిపాత్రులయ్యారు.

ఒకసారి కావేరిలో స్నానం చేసి ఆచార్యులు ధనుర్దాసు చేయి ఆలంబనం చేసుకొని మఠం వైపు నడిచారు. శూద్రుని స్పర్శ తగునా? అని శిష్యులు ఆక్షేపించారు. అందుకు ఆచార్యులు--

*విద్యామదో ధనమద స్తృతీయోఌ భిజనో మదః ।*
*ఏతే మదావలిప్తానాం ఏత ఏవ సతాం దమాః ॥*

అని బదులు చెప్పారు. ‘విద్యామదం, ధనమదం, అభిజనమదం – ఇవి మద గర్వగ్రస్తులకు ఉంటాయి. సజ్జనుల పాలిటికి ఇవి వ్యత్యస్తాలై దమాలుగా మారుతాయి’ అని భావం. ధనుర్దాసు మదరహితుడు. కాన పవిత్రుడని తాత్పర్యం. కాని వైష్ణవుల కా సమాధానం తృప్తి కల్గించలేదు. పైగా ధనుర్దాసును అకారణంగా



నిందించసాగారు. ఎలాగైనా అతని నవమానించాలని నిశ్చయించుకొన్నారు. వారి దుశ్చింత ఆచార్యులకు తెలిసింది.

ఒకనాడు యతిరాజు ఒక ఆంతరంగిక శిష్యునితో ధనుర్దాసు నీసడించిన వైష్ణవులారవేసిన కాషాయ వస్త్రాలనుండి రహస్యంగా కౌపీనానికి సరిపడునట్లు రాత్రి పూట వస్త్రం చించుకొని రమ్మన్నారు. శిష్యుడాపని చేశాడు.

మరునాడు చినిగిన వస్త్రాలు చూచుకొని సన్న్యాసులు కోపోద్దీపితులై ఒకరినొకరు కలహించుకొన్నారు. పోట్లాటకు సిద్ధమైన వారిని ఆచార్యులు శాంతింప జేశారు.

కొంతకాలం పిదప ఒకనాటి రాత్రి ధనుర్దాసుతో ఇష్టాగోష్ఠి జరుపుతూ రహస్యంగా ఇద్దరు సన్న్యాసులను పిలిచి “మీరిప్పుడు ధనుర్దాసు ఇంటికి పోయి హేమాంబ సొమ్ములు దొంగిలించుకొని రండు” అని పురి కొల్పాడు. వైష్ణవులు అట్లే అని పోయి నిద్రిస్తున్న హేమాంబ శరీరంలోని ఒక ప్రక్క సొమ్ములు ఒలిచి తీసుకొన్నారు. ఆమె ఇంతలో మేలుకొని ఆచార్య పురుషుల్ని గుర్తించి రెండవ ప్రక్క సొమ్ములు తీసుకోవడానికి అనుకూలంగా అటువైపు పొరలింది. ఆమె మేలుకొన్నదని వారు వెంటనే పారి పోయారు.

తరువాత ధనుర్దాసు ఇంటికి పోయాడు. ఆచార్యులు శిష్యులను ధనుర్దాసు ఇంట ఏమి జరుగుతున్నదో గమనించి రమ్మని పంపారు. వారు పోయి అట్లే గమనించారు. సొమ్ములేమైనవని ధనుర్దాసు అడుగగా ఆమె జరిగిన సంగతి అతనికి చెప్పింది. అప్పుడు ధనుర్దాసు “వారు సొమ్ములు తీసుకొంటుండగా ఎందుకు కదిలావు? అయ్యో! నీవు మేల్కొన్నావని వారు పారి పోయారు. భాగవతోత్తముల విషయంలో ఇలా చేయవచ్చా?” అని భార్యను మందలించాడు.

శిష్యులీ సంభాషణ విని వెళ్ళి ఆచార్యులకు విన్నవించారు. ఆచార్యులు వైష్ణవులను పిలిచి "చూచితిరా! ధనుర్దాస దంపతుల భాగవత భక్తి! కాషాయవస్త్రాలు చినిగినవని కలహించుకొన్న మీరెక్కడ? ఆభరణాలనే భాగవతులపహరించికొని పోవుటకు సిద్ధమైన వారెక్కడ? ఇంకనైనా బుద్ధితో మెలగండి" అని వారికి బుద్ధి చెప్పారు.

తెల్లవారగానే ధనుర్దాసును పిలిచి విషయం చెప్పి సొమ్ములు ఇచ్చి పంపారు. ధనుర్దాసు కాదనలేక తీసుకొని పోయాడు.

## మారనేర్నంబి

మరొక పర్యాయం జరిగిన సంఘటన. 'మారనేర్నంబి' అనే జ్ఞాని శరీర పరిత్యాగం చేశాడు. శ్రీమహాపూర్ణులు ఆయనకు బ్రహ్మ మేధవిధి ననుసరించి సంస్కారం చేశారు. శూద్రునకట్లు చేయ దగదని వైష్ణవులు ఆక్షేపించారు. మహాపూర్ణులను నిందించారు. ఆయన కుమార్తె తండ్రికి సంభవించిన దుష్కీర్తికి వగచి ఆలయంలోకి పోవడం మాని వేసింది.

ఆచార్యులు శ్రీమహాపూర్ణుల చెంతకుపోయి అట్లేల చేసితిరో తెలుపమని ప్రార్థించారు. "ఆనాడు శ్రీరాముడు జటాయువుకు చేసిన సంస్కారం మీరెరుగరా? విశేష ధర్మాచరణ శాస్త్ర విరుద్ధం కాదు" అని వారు చెప్పగా ఆచార్యులు దానికి సమ్మతించారు.

మరొకసారి ఆచార్యులు శూద్రుడైన ఒక మూగవాణ్ణి యింటిలోకి తీసుకుపోయి "నా యీ పాదాలే నీకు రక్ష!" అని సంజ్ఞతో ఎరుకపరచారు. అది చూచి కూరేశుడు "నేను ఈ పాటి గురు కటాక్షం పొందలేక పోయానే? అగ్రవర్ణజుడనై యుండి ప్రయోజనమేమి?" అని చింతకు లోనయ్యాడు.



## క్రిమి కంఠుడు

ఆ రోజుల్లో క్రిమికంఠుడనే చోళరాజు రాజ్యాన్ని పాలిస్తుండే వాడు. అతడు వైష్ణవద్వేషి, శివభక్తుడు. వైష్ణవులతని ఏలుబడిలో సుఖంగా జీవించలేకపోయారు.

ప్రజలందరినీ శివభక్తులు కావలసిందిగా ఆ రాజు నిర్బంధించేవాడు. 'శివాత్పరతరం నాస్తి' అన్నది అతని సిద్ధాంతం. ఆ మాట వ్రాసి యిమ్మని ఇతర మతస్థులను బాధించేవాడు. వ్రాసి యిచ్చిన వారు అన్యథా ప్రవర్తిస్తే వారి కన్నులు పెరికించడమో, కాళ్లు చేతులు నరికించడమో చేసేవాడు.

దుష్టుడైన ఆతని మంత్రి ఒకడు శ్రీరామానుజులచే 'శివాత్పరతరం నాస్తి' అని వ్రాయిస్తే మీ కీర్తి వ్యాపిస్తుందని రాజుకి దుర్బోధ చేశాడు. రాజు 'రామానుజులను పట్టి తెండు" అని భటులను పంపినాడు.

ఆచార్యులు నదికి స్నానానికి వెళ్ళిన వేళలో భటులు మఠంలోనికి ప్రవేశించారు. కూరేశుడు విషయం గ్రహించి గురువు గారి కాషాయ వస్త్రాలు ధరించుకొని తానే రామానుజులనని చెప్పి భటులతో గూడ చోళ రాజధానికి పోయాడు.

స్నానం చేసి వచ్చిన ఆచార్యులు సంగతి తెలుసుకొని కూరేశునకై వగచారు. ఇక అక్కడ ఉండడం ప్రమాదకరమని కూరేశుని వస్త్రాలు ధరించి మఠం వీడి ఊరికి పడమరవైపుగా పయనించారు.

కొంతమంది శిష్యులతో ఆచార్యులలా ఐదు రోజులు నడక సాగించారు. ఆరవ రోజు రాత్రి ఒక అడవిలో ప్రవేశించారు. అక్కడి బోయలు కొందరు ఆచార్యులవారిని గుర్తించి పండ్లు, పాలతో ఆతిథ్యం సమకూర్చారు.

## చేలాంచలాంబ

ఆ మరునాడు ఒక పల్లెలో ఒక విప్ర గృహం ఉన్నదని తెలుసుకొని అక్కడికి వెళ్ళారు. ఆ యింటి యిల్లాలు చేలాంచలాంబ పరమ భక్తురాలు. ఆమె పూర్వం ఒకసారి ఆచార్యులవారి నాశ్రయించి మంత్రదీక్ష పొంది వుండినది. ఆమె వారిని గుర్తించి తగిన రీతిని ఆతిథ్యం నిర్వహించింది. తన భర్తకు గూడ పంచ సంస్కారాలు గల్గించి ధన్యత చేకూర్చింది.

అటనుండి పయనమై ఆచార్యులు సపరివారంగా మిథిలా నగర ప్రాంతంలో ఒక గ్రామం చేరుకొన్నారు. అక్కడి విప్రులు అద్వైతులు. వారు ఆచార్యుల వారిని ఆదరించలేదు. కాని ఆ గ్రామస్థులు నీరు తెచ్చుకొనే సరోవరంలో దాశరథి ఆచార్యులవారి సూచన మేరకు తన పాదాలు ఉంచి కొంతసేపుండగా గ్రామస్థుల మనస్సు మారింది. వారు ఆచార్యుల నాశ్రయించి సత్కరించారు. ఆ గ్రామానికి సాలగ్రామమని ఆచార్యులు నామకరణం గావించారు. ఆపైన క్రిమికంఠ సంహారానికై అభిచారహోమం ఆచార్యులు నిర్వర్తించారు.

ఆ దేశాన్ని పాలించే విట్ఠల భూపతి కుమార్తెను బ్రహ్మ రాక్షసుడావేశించాడు. ఆచార్యులు రాజపుత్రికకి పట్టిన పీడను వదిలించారు. రాజు శిష్యుడైనాడు. తద్వారా వైష్ణవమతవ్యాప్తి సుకర మయింది. అక్కడి వారందరికీ పంచ సంస్కారాలు జరిగాయి.

విట్ఠలరాజుకు గురువులైన బౌద్ధులు - అతడు వైష్ణవం పుచ్చుకొన్నాడని తెలుసుకొని కోపించారు. ఆచార్యులను ఎదుర్కోవడానికి సహస్ర సంఖ్యలో విచ్చేశారు. వాదం ఏర్పాటైనది. ఆచార్యులు ఒక



తెర కట్టించి దాని కావల వారి నుండమన్నారు. ఈవల వారు ఆదిశేష రూపంతో నుండి వాదించి వారినందరినీ పరాజితులను గావించారు. ఆపై కొంత కాలం ఆరాజాశ్రయంలో అక్కడే ఉండిపోయారు.

## యతిరాజ సంపత్కుమారుడు

శ్రీరంగం నుండి తెచ్చిన తిరుమణి కాళీ అయినది. ఆచార్యులు దానినెట్లు పొందడమా? అని విచారించారు. యదుగిరి నారాయణ స్వామి కలలో కనిపించి "యాదవాచలంలో వలసినంత తిరుమణి ఉన్నది. అక్కడికి రమ్ము" అని చెప్పాడు. పూజాదులు లేకుండా పడివున్న తన కొక గుడి కట్టించమని గూడా దేవుడానతిచ్చాడు.

కల విషయం విట్ఠలరాజుకు చెప్పి ఆతని సాయంతో ఆచార్యులు యదుగిరికి పయనమై పోయారు. అక్కడ త్రిదండంతో త్రవ్వగా వలసినంత శ్వేత మృత్తిక లభించింది. అక్కడి తిరునారాయణ స్వామి విగ్రహాన్ని కనుగొని ఆలయంలో ఆచార్యులు ప్రతిష్ఠించారు.

ఉత్సవమూర్తి ఢిల్లీ పాలకుడైన చక్రవర్తి యింట ఉన్నదని మరల కలలో దేవుడు నిర్దేశించాడు. రాజు సాయంతో ఆచార్యులు సపరివారంగా కొంత సైన్యంతో సహా ఢిల్లీ వెళ్ళారు. చక్రవర్తి వారికి స్వాగతమర్యాదలు నిర్వహించారు.

"మీవద్ద మా ఉత్సవమూర్తి ఉన్నది. మాకు దాని నిప్పించ వలసినది" అని ఆచార్యులు చక్రవర్తి నడిగారు. అది యుద్ధంలో రాజులను జయించి తెచ్చిన విగ్రహాలలో ఒకటి. కాని యితర విగ్రహాల మధ్య కనిపించలేదు. అంతఃపురంలో ఉన్నదని మరల ఆచార్యులవారికి భగవంతుడు కలలో చెప్పాడు. అది రాజపుత్రిక సంరక్షణలో ఉండినది. ఈ సంగతి చక్రవర్తికి తెలిపి ఆచార్యులు అంతఃపురం ఎదుట నిలిచి

"రామప్రియా రామ్మా!" అని పిలిచారు. వెంటనే విగ్రహం బాలునివలె నడిచి వచ్చి ఆచార్యుల తొడపై కూర్చున్నది. అందుకే ఆ మూర్తి 'యతిరాజ సంపత్కుమారుడు' గా పేరొందింది. చక్రవర్తి ఆచార్యుల నెంతగానో కీర్తించారు.

చక్రవర్తి పుత్రిక విగ్రహ వియోగం సహించలేక దుఃఖించింది. ఎంత చెప్పినా వినలేదు. ఇక చేసేది లేక ఆమెను గూడా చక్రవర్తి విగ్రహంతో పంపారు. ఆచార్యులవారు ఢిల్లీ నుండి పోయి యదుగిరిలో విగ్రహ ప్రతిష్ఠ చేశారు. దారిలోనే చక్రవర్తి కుమార్తె విగ్రహంలో ఐక్యం కావడంవల్ల ఆమె విగ్రహాన్ని కూడా అక్కడ ఆచార్యులు ప్రతిష్ఠింప జేశారు. ఆమెయే 'బీబీ నాచ్చియారు'. ఈమె తిరుపతిలో ఉన్నదని కొందరు భావిస్తారు. ఆ భావన సరి కాదు.

యదుగిరిలో ఒక మఠం నిర్మించి ఆచార్యుల వారచ్చట చాలాకాలం నివసించారు. వైష్ణవ సిద్ధాంత ప్రచారానికై కృషి చేశారు. కాని శ్రీరంగంలో ఇంతకాలంగా ఆచార్యులు లేని లోటు స్పష్టంగా కనిపించింది.

## కూరేశ మహాపూర్ణుల నేత్రోత్పాటనం

కూరేశుడు ఆచార్యులకు బదులుగా చోళరాజువద్దకు పోయినాడని తెలుసుకొన్నాము. ఆయనతో పాటు మహాపూర్ణులు కూడా పోయినారు. కూరేశుని వంచన గ్రహించి ఆగ్రహోదగ్రుడైన చోళరాజు 'శివాత్పరతరం నాస్తి' అని వ్రాయమన్నాడు. కూరేశుడేది చెప్పబోయినా వినిపించుకోక నిర్బంధించినాడు. అంతట కూరేశుడు "ద్రోణమస్తి తతః పరం" అని వ్రాశాడు. శివ ద్రోణాలు రెండూ కొలత పాత్రలు. శివమున కంటె కొలతలో ద్రోణం పెద్దది. ఈ పరిహాసానికి క్రుద్ధుడైన



క్రిమికంఠుడు కూరేశ – మహాపూర్ణుల నేత్రాలను పెకలింపజేసి వారినట నుండి తొలగించినాడు.

గ్రుడ్డివారైన వారిరువురూ అనుయాయుల సాయంతో శ్రీరంగానికి బయలుదేరారు. దారిలో శ్రీమహాపూర్ణులు పరమపదం చేరారు. వారి వయస్సు 105 సంవత్సరాలు. శ్రీరంగం చేరిన కూరేశుడు మహాపూర్ణులకువలె నాకు మోక్షంరాక పోయెనే అని దుఃఖించాడు.

ఈ దుర్వార్త ఆచార్యులవారికి తెలిసింది. వారెంతో పరితపించారు. యదుగిరిలోనే తదీయారాధనాదులు ఘనంగా నిర్వర్తింపజేశారు.

చోళరాజు శ్రీరామానుజానుయాయులను పెక్కుమందిని శ్రీరంగంనుండి వెళ్ళ గొట్టాడు. కూరేశుడు శ్రీరంగం వీడి 'వానమామల' చేరి అక్కడి సుందరబాహుస్వామిని సేవిస్తూ వుండి పోయాడు. శ్రీస్తవం, సుందరబాహుస్తవం, అతిమానుషస్తవం, శ్రీవైకుంఠస్తవం, – అన్న నాలుగు స్తవాలను రచించాడు. అవి పంచస్తవములలోనివి.

శ్రీరామానుజులు కూరేశుని తన వద్దకు తీసుకురమ్మని శిష్యులను పంపారు. వారు పోయి విషయం చెప్పగా కూరేశుడు ఎంతో సంతోషించాడు.

ఇంతలో క్రిమికంఠుని కంఠంలో వ్రణం పుట్టి అతడు దుర్మరణం చెందాడు. ఈ వార్త విని ఆచార్యులు ఆనందించారు. ఇక శ్రీరంగానికి బయలుదేర సిద్ధమయ్యారు. అప్పటికి వారు శ్రీరంగం వీడి పండ్రెండు సంవత్సరాలు గడిచాయి.

యదుగిరివాసులు ఆచార్యుల వియోగాన్ని సహించలేక పోయారు. ఆచార్యులవారు వారి తృప్తికై తన విగ్రహం చేయించి

అక్కడ ప్రతిష్ఠింపజేసి వారి సమ్మతితో శ్రీరంగం చేరుకొన్నారు. వారు వచ్చినందుకు శ్రీరంగవాసులు ఎంతో సంతోషించారు. వారు శ్రీరంగం వస్తున్నారని విని కూరేశుడు వానమామలనుండి శ్రీరంగానికి వచ్చాడు. అతనిని చూచి ఆచార్యులు మిగుల పరితపించారు.

## తిరుపతిలో గోవిందరాజ ప్రతిష్ఠ

ఒకనాడు వైష్ణవులు కొందరు ఆచార్యుల చెంతకు వచ్చి "స్వామీ! మేము చిత్రకూటంనుండి వచ్చాము. అక్కడ క్రిమికంఠుని అనుయాయులు విష్ణుదేవతా విగ్రహాలను ధ్వంసం చేసి ఆ స్థానమున శివలింగ ప్రతిష్ఠలు చేశారు. శ్రీగోవిందరాజ విగ్రహాన్ని సముద్రంలో పారవేయగా 'తిల్ల' అను భక్తురాలు ఆ విగ్రహాన్ని రక్షించి తిరుపతి చేర్చింది. మీరు తిరుపతిలో దానిని ప్రతిష్ఠించండి!" అని ప్రార్థించారు.

వెంటనే భగవద్రామానుజులు తిరుపతికి పోయి తిల్లను అభినందించి శ్రీగోవిందరాజస్వామిని తిరుపతిలో ప్రతిష్ఠించారు. ఆపై తిరుమలకు పోయి శ్రీనివాసుని సేవించారు. తరువాత కంచికి వచ్చి శ్రీవరదరాజస్వామి నారాధించి శ్రీరంగం చేరుకొన్నారు. యథావిధిగా వైష్ణవ ధర్మవ్యాప్తికి కృషి చేశారు.

## కూరేశుని నేత్రప్రాప్తి

కూరేశుడు శ్రీరామానుజుల సలహా ననుసరించి 'వరదరాజస్తవం' అన్న ఐదవ స్తవం రచించి ఆచార్యులవారితో కంచికి పోయి ఆస్తుతిని స్వామివద్ద పఠించగా ఆయనకు దృష్టి సిద్ధించింది.

శ్రీగోదాదేవి ఏనాడో సంకల్పించిన విధంగా ఆచార్యులవారు వానాద్రిలో సుందరబాహుస్వామికి నూరు వెన్న భాండాలు, నూరు



శర్కర పొంగలి ఘటాలు ఆరగింపుచేసి ఆమె మ్రొక్కు తీర్చి 'గోదాగ్రజ' బిరుదం పొందారు.

ఒకసారి కురుకాపురికి పోయి శ్రీనమ్మాళ్వారులను సేవించి వారి పరంపరకు చెందిన భూరి శ్రీశైలపూర్ణుడనే విప్రుణ్ణి దత్త పుత్రుడుగా స్వీకరించారు. అతనికి కురుకేశుడని నామకరణం చేశారు. తిరిగి శ్రీరంగం చేరుకున్నారు.

## రచనలు

ఆచార్యులవారి రచనలలో శ్రీభాష్యము, వేదాంతసారము, వేదాంత దీపము, నిత్యభగవదారాధనము, వేదార్థ సంగ్రహము, భగవద్గీతా భాష్యము ప్రసిద్ధాలు. అట్లే శరణాగతి గద్యము, శ్రీరంగ గద్యము, శ్రీవైకుంఠ గద్యము – అను గద్య త్రయం కూడా సుప్రసిద్ధం.

## అవతార సమాప్తి

చివరి దశలో శ్రీపరాశర భట్టారకుని వైష్ణవ సామ్రాజ్యాధిపతిగా చేసి ఆచార్యులు తమ 120 వ ఏట క్రీ.శ. 1137 వ సంవత్సరంలో మాఘ శుద్ధ దశమినాడు అవతారం చాలించారు.

*తస్మాదయం లక్ష్మణ దేశికేంద్రః*
*సాక్షాద్ధరి ర్లోక గురుర్మహాత్మా।*
*తస్యైవ సంబంధబలేన తేన*
*మోక్షో హి సిద్ధో నిఖిలాత్మకానామ్॥*



Printed at TTD Press, Tirupati.—Copies : 2,000—D:\Book/Sri Bhagavad Ramanujulu—Dt.20-4-2016—**THOTA**